Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ జూలై నెల 31 వ తేది శుక్రవారం [నె 30 రు.



*

రష్యావారి మరఫిరంగి దాచి యుంచిన విధం. పైకగుపడ కుండా దానిపై ఆకులు కప్పబడి, శత్రువు దాడివచ్చు మార్గమునకు అడ్డంగా నుంచబడినది, పేల్చే వారుగూడ పైన కప్పుకొని యున్నారు.

*

## అంగీకరింపక తప్పని విన్నపము.

### సైన్య సౌకర్య సహాయ నిధి.

రాష్ట్రాధిపతిగగాని, మానవ సహజమగు ఔదార్యంగల వ్యక్తిగగాని, మన మదరాసు గవర్నరుని మించినవారు వేరొక రుండరనుటకు సందియంలేదు. సర్ ఆర్థరు హోపుగారివంటి అనుభవం ఖ్యాతిగల వ్యక్తి అనవసరంగా అనేక సారులు హెచ్చరికలు చేస్తారనిగాని, బాధించే వరకు భారం మోపుతారనిగాని అనుటకు వీలు లేదు. గవర్నరు యుద్ధ నిధి చందాలకై తాను గావించిన విన్నపము నాలించి రెండు కోట్లవరకు చందాలిచ్చినందులకు మదరాసు ప్రజలకు కృతజ్ఞ తదెల్పుచు కొద్దికాలం క్రిందటనే వారు హృదయ పూర్వకమగు ప్రకటన గావించిరి. అప్పటినుండి వారు, గవర్నరు యుద్ధ నిధినుండి కొనదలచిన ఆయుధాలు మందుగుండు, ఫైటరు బాంబరు విమానాలు, బ్రెను ఫిరంగి బండ్లు, మున్నగు బ్రిటను-ఇండియాల రక్షణ సాధనములు యెక్కువ సంపాదించుటకు ఎక్కువ పాటుబడుచుండిరి. రాజకీయ ఆర్థిక పరిస్థితులు తారుమారయి ఆందోళన పడుచున్న ప్రజలయెడ ఎంతయు సానుభూతితో ప్రవర్తించిరి.

అయినను, వచ్చేవారం వారొక క్రొత్త నిధికై స్వయంగా రేడియోద్వారా ఒక విన్నపం ప్రకటింపనున్నారు. అది "సైన్య సౌకర్య సహాయ నిధి" యనబడును. మదరాసు ప్రజలు యిది వరకు దయతో చందాలిచ్చిన నిధులన్నింటిలో దేనికిని యిది తీసిపోదని ఊహాజ్ఞానంగల ప్రతి వారికిని గవర్నరుగారు నచ్చచెప్పగలరు.

**నిధికి ఆవసరం.** సాధారణంగా సంచారంచేసే అవకాశం లేని వారికి, శాంతి కలవాటుపడిన యీ రాష్ట్రంలో ఎంత మార్పు కలిగిందో తెలియుట కష్టం. ఈ రాష్ట్రానికి చెందనివారు, అయినను విస్వాసంతో సమర్థతతో మన ఆస్తులను ప్రాణాలను కుటుంబాలను రక్షించుటకు గార్డియనులుగ పని

చేయుచు, ఆధునిక యుద్ధ ప్రమాదాలకు లక్ష్యం చేయక మనకు శాస్వతంగా శాంతి చేకూర్చుటకు విజయం చేకూర్చుటకు యుద్ధంలోకి ఉరుకుటకు సిద్ధంగానున్నవారు ఎందరో మన రాష్ట్రానికి వచ్చిరి, యింకను అధికంగా వస్తున్నారు. పంజాబీలు, గూర్ఖాలు, బెలూచీలు జాట్సు, బ్రిటిషువారు, అమెరికనులు, వేలకువేలు వచ్చి యిచట సరియైన సదుపాయాలు లేని శిబిరాలలో డేరాలలో పాకలలో నివశించుచున్నారు. తెలుగువారికి అరిజోనా, అరవవారికి మానుద్వీపం ఎంత క్రొత్తో యీ సైనికులకు యీ దేశం అంత క్రొత్త. వారికెట్టి సదుపాయాలూ లేవనే చెప్పవచ్చును.

వారు మనకొరకై చేయుచున్న త్యాగమునకు చేయనున్న మహా త్యాగమునకు ప్రశంసా పూర్వకంగా మనం చూపవలసిన కృతజ్ఞతా చిహ్నంగా, నిర్వర్తింపవలసిన కనీస ధర్మం విషయమున మనకు నచ్చజెప్పుటకు గవర్నరుగారికి కష్టముండదు. ఆ సైనికులు అతి జాగరూకతతో కాపలా కాయునపుడు వేచియుండు సమయంలో విసుగులేకుండా కష్టంలేకుండాచేయుటకై తగు సదుపాయాలకు ధన నిధిని వసూలుచేసి, అది జాగ్రత్తగ వినియోగించుట మన విధి. గవర్నరుగారు వారికి సహజమగు విస్పష్టమగు విధమున యుక్తియుక్తముగ నచ్చజెప్పదలచిన విషయంగూర్చి మేము ముందుగ విస్తరించి చెప్పదలచుకోలేదు. ఒక్క కథమాత్రం యికడ నుదహరించెదము : ఫీల్డు ఆంబులెన్సు యూనిటు, అంటే యుద్ధరంగంలో వైద్య సహాయంచేయు దళంయొక్క మామూలు పని, యుద్ధసమయంలో తాత్కాలిక చికిత్స చేసి చనిపోయినవారిని గాయపడినవారిని అతి త్వరగా ఆఖరు స్థానానికో బేసు ఆస్పత్రికో తీసుకపోవుట. ప్రస్తుతానికి మాత్రం మన దేశంలో యుద్ధాలు జరుగుటలేదు. కావున సైనిక చర్యలు అంతచురుకుగా కదలుటలేదు. కావున ఒక ఫీల్డు ఆంబులెన్సు యూనిటునందు రోగులు వారాలకొలది అందే యుండిపోయిరి. వారికెట్లా యుంటుందో ఆలోచించండి. ముగ్గురు నల్గురు ఆఫీసరులు, ఇరవై మంది పనివారు ఆంబులెన్సు డేరాలలో తమకు పరిచయంలేని దేశంలో తెలిసిన వారొకరైనా కంటి కగుపడకుండా, పొగాకు మిఠాయి బిస్కట్లు, క్షవరంబ్లేడులు మున్నగు సాధారణంగా కావలసిన వస్తువులు కొనుక్కొనుటకైనా వీలులేని పరిస్థితులలో, చదవడానికి పత్రికలులేక, రేడియోగాని గ్రామఫోనుగాని లేక తెలియని ప్రదేశంలో వారాల తరబడి కాలంగడపడం ఎంత చికాకుగ నుంటుందో ఆలోచించండి. గవర్నరుగారు ప్రకటింపనున్న "సైన్య సౌకర్య సహాయ నిధి" ప్రారంభమయినాక, గవర్నరుగారికి వారి విన్నపం ఆలించి చందాలిచ్చు మదరాసు ప్రజలకు కృతజ్ఞత తెలుపు ఆశేష జనంలో వీరోభాగం.

---

# సైనిక జాతులు ఉత్తర హిందూస్థానంలో మాత్రమే లేవు.

## లిబియాలో మదరాసు ఫిరంగిదళం ఘనత.

లిబియా యుద్ధరంగమున మదరాసీ సైనికులు ఒనర్చిన ఘన కార్యముల వివరములు యిపుడు తెలియవచ్చుచున్నవి. మదరాసు సేపరు దళమువలెనే, ఫిరంగులు ప్రేల్చే దళములుగూడ శాంతి సమయంలోను, గుండ్లవర్షం పడుచున్నపుడుకూడా ఒకే పట్టుదలతో ధైర్యంగానుండి కీర్తి గడించిరి.

ఆఫ్రికా ప్రాంతముందు ఒక భారతీయ ఫిరంగిదళం రెజిమెంటులో అరవలు తెలుగువారు మళయాళీలు గలరు. అది యిటీవలనే యేర్పడిన దళం. ఈజిప్టులో యుద్ధజ్వాలరేగక మునుపు వారికి అసలు యుద్ధంలోగాని, ప్రత్యేకంగా ఎడారి యుద్ధంలోగాని ఏమీ అనుభవంలేదు. ఒక నాడుదయం యీ దళముపై ముందు జర్మను పాంజారు డివిజను, తరువాత ఇటలీ డివిజను దాడిచేసెను. మదరాసీలు వెంటనే యుద్ధం ప్రారంభించి, ఫిరంగులు అత్యద్భుతంగా ప్రేల్చేరు. జర్మను టాంకులు ఒకదాని తరువాత ఒకటి పడిపోయినాయి. ప్రతివాడు తన ఫిరంగి వద్ద నిలచెను. అయితే జర్మనులు చాల అధిక

సంఖ్యగ నుండుటచేత, మదరాసీలను చివరకు ఓడించిరి. ఇటలీ సైనికులు టాంకుల వెనుక వచ్చి, మనవారిని వశపరచుకొనిరి కాని కొద్ది ఘంటలు మాత్రమే. యుద్ధం గాభరాలో పలువురు తప్పించుకొని, తిరిగి డ్యూటిలో చేరిరి. వారిపుడు తిరిగి క్రొత్త పరికరాలు చేకూర్చుకొని వేరొకసారి శత్రువు నెదుర్కొనుటకు సిద్ధమగుచున్నారు.

వారు జరిపిన యుద్ధం చాల ప్రశంసలను బడసెను. పార్లమెంటులో చర్చిల్ ప్రధాని ప్రత్యేకంగా కొనియాడిన ఫిరంగి దళాలలో నిది యొకటి. ఈ యుద్ధంలో మదరాసీ ఫిరంగి రెజిమెంటు పాల్గొనుటకు యిదే ప్రథమం.

ఇండియాలో ఉత్తర హిందుస్థానమునందే వీర జాతులు గలవను వాదు అసత్యమని యీ మదరాసు దళం రుజువు చేయగలదు.

---

## యేషియాపై జపాను దాడికి చీనా నిరోధం.

చీనాలో జపాను సేనాని ప్రకటన.

" చీనాలోనున్న జపాను సేనల నాయకుడు షునురోకు హాటగారు, తూర్పు ఆశియా సమాన సౌభాగ్య ప్రాంత విస్తీర్ణ కార్యమునకు చీనా నిరోధంగానుందని అంగీకరించేరు. అంటే చీనాపై జపాను దాడి విఫలమయిందని వారంగీకరించి రన్నమాట " అని చుంగ్‌కింగు నగరంలోని నేషనలు హెరాల్డు పత్రిక వ్రాసెను. వారి మాటలు జపానీయులకు చేదు మాత్రలవలె రుచించక పోవచ్చును. ఏమన మూడు నెలలలో చీనాను పడగొడతామని వారికి యిదివరకు తెలుపబడుచుండెను.

" హాటాగారిట్లు ప్రకటించుటకు తగు కారణాలు లేకపోలేదు. చీనా యుద్ధం ప్రారంభించి ఆరో యేడు నడుస్తున్నది, జాపాను యింకను గమ్యస్థానం చేరలేదు. విశాల ప్రదేశము లాక్రమించింది కాని, చీనా పూర్తిగ ఓడిపోతేగాని అందలి శిరిసంపదనంతా యీ యుద్ధంలో సంయుక్త రాజ్యాలకు ప్రతికూలంగా వినియోగింపజాలదు. అందుకనే ' చీనాయుదంతం ' ముగుస్తేనేగాని జపాను తూర్పు ఆశియా సమాన సౌభాగ్య ప్రాంతీయాభివృద్ధి " కార్యం కొనసాగింప వీలులేదని తన దేశీయులకు జనరలు హాటాగారు హెచ్చరించుచున్నారు.

" కాని జపానీయులకు యీమాత్రం తెలియకపోదు. ఆశలుడిగేయి కనుక చీనాపై యుద్ధం యింక జపాను మానుకుంటుందనుకోరాదు. జపాను సేనా నాయకులు చాల చొరవుచేసి తమ కీర్తినంతా యిందొడ్డినారు. జపాను సైనిక నావికదళాలు జాతీయ ఆత్మ హత్యకైన అంగీకరిస్తాయిగాని చీనా యుద్ధం ముగించుటకు ఒప్పుకోవు. ప్రస్తుత జపాను ప్రభుత్వ విధానం ఎట్లుందో హాటాగారి ప్రకటన తెలుపుచున్నది. జపాను తాను గెల్చింది నిలబెట్టుకొని, తరువాత చీనాను ఓడించగల్గినచో అందుకు కొంతకాల విళంబనమైనా చేయును. సంయుక్త మిత్రమండలి రాజ్యాలు అట్లా జరుగకుండా శ్రద్ధ వహించాలి " అని చీనా పత్రిక వ్రాసెను.

---

## అమెరికాకు బంగారం పోవుట నిలిచింది.

ఇండియాలో సువర్ణం తయారగుచున్నది.

అమెరికా సంయుక్త రాష్ట్రములకు బంగారం పోవుట 1941 వ సం॥లో తగ్గిపోయింది.

1941 వ సంవత్సరంలో ఆదేశానికి 200 లక్షల ఔన్సుల బంగారం మాత్రం ఎగుమతి చేయబడినది; అంతకు ముందు వత్సరం 1,040 లక్షల ఔన్సుల బంగారం అధికంగా చేరింది. 1941 వ సంవత్సరాంతమున ఆ దేశంలో 6,500 లక్షల ఔన్సుల బంగారం ఉండెను. 1940 వ సం॥ ఆఖరులో 6,290 లక్షల ఔన్సులుండెను.

అమెరికా ప్రభుత్వంవారివద్ద 1941 ఆఖరుకి 32,800 లక్షల ఔన్సుల వెండి యుండెను. అందు 1,399 లక్షలే ఆ సంవత్సరం ఆ దేశానికి చేరింది. అంతకుముం దేయేడు అంత తక్కువ దిగుమతి కాలేదు.

ఇండియాలో 1941 వ సంవత్సరమునందు 285,162 ఔన్సుల వెండి రూ 3,27,15,301 విలువగలది తయారయినట్లు అంచనా వేయబడెను. 1940 లో 289,324 ఔన్సులు రూ 3,24,61,066 లు విలువగలది తయారయింది.

1941 లో ప్రపంచం అంతటిలో 41,000,000 ఔన్సుల బంగారం తయారయినట్లు అంచనా వేయబడెను; వెండి ఉత్పత్తి 268,000,000 ఔన్సులు. 1940 లో అన్ని సంవత్సరాలకన్న ఎక్కువ 2,780 లక్షలు ఉత్పత్తి అయినది.

# కాంగ్రెసు వర్ధా తీర్మానం.

## అక్ష రాజ్యాలకు ఆనందం—దేశంలో ప్రతికూలాభిప్రాయం

## తీర్మానంవల్ల కలిగే ముప్పు.

కాంగ్రెసు వర్కింగు కమిటీవారు వర్ధాలో గావించిన తీర్మానం అనుచితమయినదేగాక, ఇండియాకును సంయుక్త రాజ్యాలకును హానికరమయినదని కాంగ్రెసేతర నాయకులందరును ఏకగ్రీవంగా వెలిబుచ్చిరి. టైమ్సు ఆఫ్ ఇండియా పత్రికకు సర్ తేజ బహదూరు శప్రుగారు యిట్లు వ్రాసిరి :—

"ముఖ్యంగా ఇటువంటి సమయంలో వర్ధాతీర్మానమంత ప్రమాదకరమయినది యింకొకటిలేదని నేను దృఢముగ నమ్ముచున్నాను"

మన దేశంలో అంతః కలహాలు, కొట్లాటలు జపానువారికి ఆహ్లాదం కలిగించగలవు. అట్టి యీ సమయంలో 40 కోట్ల ప్రజల జీవితాలతో జూదమాడుటకు ఎవ్వరికిని హక్కులేదని సర్ శప్రూగారు భావించుచున్నారు. బహిరంగంగా గాని రహస్యంగాగాని తిరుగుబాటు మాటచెప్పుటకే యిది సమయంకాదనియు, ప్రస్తుత పరిస్థితులలో బుద్ధి పూర్వకంగా దేశంలో అరాచకం తెచ్చిపెట్టుట సబబుకాదనియు వారు అంటున్నారు.

ఇండియాలోను ఇంగ్లాండులోనుగూడ నాయకులు యిటువంటి అభిప్రాయములనే వెలిబుచ్చిరి. జూలై 26 వ తేదీన అమెరికా ప్రజలకు రేడియో సందేశంలో సర్ స్టాఫర్డు క్రిప్సుగారు, కాంగ్రెసు నాయకులు బెదరించుచున్న సమిష్టి శాసనోల్లంఘనము ఇంగ్లాండు అమెరికాల రెండింటి యుద్ధ ప్రయత్నాన్ని భంగపరచుటకును మన ఉభయుల శత్రువులకు ఆనందం కలిగించుటకును ఉద్దేశింపబడినదనిరి. జపానుపై యుద్ధం సాగించుటకు సురక్షితమయిన స్థానంగా ఇండియాను ఉంచుకొనుట సంయుక్త రాజ్యాల విధియైయున్నదని సర్ స్టాఫర్డు క్రిప్పుగారనిరి.

"అందు కేమేమి చేయవలసియున్న అవి మనంనిర్భయంగా చేయాలి" అనిరి.

కాంగ్రెసు స్వాతంత్ర్యం కోరడంగూర్చి సర్ స్టాఫర్డుగారు ఉన్నసంగతి స్పష్టంగా యీ దిగువ రీతి తెలిపిరి :—

"యుద్ధంలో విజయం చేకూరినాక, ఇండియా తన యిష్టం వచ్చిన స్వపరిపాలన విధానం ఏర్పరచుకొనవచ్చునని చెప్పియుంటిమి. కాని ముందుగ విజయం చేకూరాలి. ఉత్సాహజీవియైన ఒక వ్యక్తి, అదివరకు తన స్వాతంత్ర్య పోరాటంలో ఎంత ప్రఖ్యాతిగాంచినవాడైనా సరే, తూర్పు ఖండమునందు సంయుక్త రాజ్యాల విజయ ప్రయత్నములకు భంగం కలిగించేటట్లు పనిచేస్తే మేము ఎంతమాత్రం ఆతని పనులు సాగనివ్వం. ఈ సమస్య యావత్ప్రపంచానికి, సంబంధించిన క్లిష్టసమస్య. ఇండియాలో గాని యింకే దేశంలో గాని, అధికారానికి తంత్రం పన్నుచున్న ఒక రాజకీయ పక్షానికి, ప్రపంచమంతటి స్వాతంత్ర్యంకొరకు పోరాడుచున్న అమెరికను, చీనా, బ్రిటిషు భారతీయ సేనలను బలియివ్వరాదు. ఇండియా క్షేమమేగాక చీనా, ఇంగ్లాండు, అమెరికా దేశాల క్షేమంకూడా యిందు ఇమిడియున్నది ఇండియాలో సంయుక్తరాజ్యాల యుద్ధరంగమును భద్రంగా తయారుగానుంచి, మన మిత్రులగు చైనీయులకు ప్రాణప్రదమగు మార్గము నురల తెరచుటకు అవసరమగు కార్యములు మేము చేయునపుడు, మీరు (అమెరికనులు) సరిగా అర్థం చేసుకొని సహాయం చేయుదురని మేము (ఇంగ్లీషువారు) నమ్ముచున్నాము."

**పత్రికాభిప్రాయాలు.**

విదేశములలో పలుకుబడిగల స్వతంత్రం పత్రికలే కాంగ్రెసు వార్ధా తీర్మానాలను హర్షింపలేదు. బ్రిటిషు పత్రికలు అమెరికను పత్రికలుగూడ గాంధిగారిని, యితర కాంగ్రెసు నాయకుల గొప్పదనమును గుర్తించుచునే, కాంగ్రెసు యీ శాసనోల్లంఘనం యీ గడ్డు యుద్ధ సమయంలో జరిపితే కలిగే ప్రమాదాలను స్పష్టంగా సూచించి తీవ్రంగా విమర్శించినవి. ఈ విమర్శలు చాల కఠినంగానున్నవి. కొన్నింట కాంగ్రెసుపై ద్రోహంచేసిందను నిందలుకూడ గలవు. తమ దేశంలో తమ ప్రభుత్వ చర్యలను యింతకన్న కఠినపదాలతో విమర్శించిన పత్రికలే, నేడు ఇండియాలో రాజకీయ పక్షములు కాంగ్రెసుకూడా వెల్లడించుచున్న స్వాతంత్ర్యా దర్శములను అనేక శతాబ్దములనుండి పూజించుచుండిన పత్రికలే, యిటువంటి విమర్శలు చేసినవి. అదివరకు కాంగ్రెసంటే అభిమానంకలిగి కాంగ్రెసును బలపరిచిన పత్రికలు, ఇండియాపట్ల స్నేహభావంగల పత్రికలే యెక్కువగ యిటువంటి విమర్శలు చేసినవి.

బ్రిటనులో ప్రధాన పత్రిక టైమ్సు యిట్లు వ్రాసెను :—



పారిసు నగరానికి 10 మైళ్ల దూరాన వాయవ్యదిక్కున ఉన్న పాయిసీయందున్న కర్మాగారము, జర్మనుల బలవంతాన దినానికి 20 మోటారులు తయారుచేస్తున్నది. దానిపై బ్రిటిషు విమానాలు బాంబులువేసి కాల్చివేసినపుడు వేరొక విమానంనుండి తీసిన ఫొటోము.

---

"ఇండియాకు స్వాతంత్ర్యం చేకూర్చే మార్గం యిదివరకే నిర్ణయించి స్పష్టంగా మనస్ఫూర్తిగా యీ దేశం ప్రకటించియున్నది. కాంగ్రెసు నాయకులు యుక్తులుపన్ని అత్యధిక రాజకీయాభివృద్ధి చేకూరే సమయం దూరం చేస్తున్నారు. అయినా ఇంగ్లాండు చేయగల్గిందేదో చేయక మానదు. ఇండియా సమస్య శాశ్వతంగా జయప్రదంగా పరిష్కరించటానికి యీ దేశంలో కొందరు ముఖ్యులు దృఢ సంకల్పం కల్గియున్నారు."

బ్రిటిషు కన్సర్వేటివు పార్టీ పత్రికయగు డెయిలీ టెలిగ్రాఫ్, కాంగ్రెసు చర్యను చాల తీవ్రంగా నిరశించింది. కాంగ్రెసు స్వాతంత్ర్యం మాత్రమే కోరుటలేదు, దేశంలో నియంతవలె అధికారం చెలాయించ కోరుతున్నది ; సర్ స్టాఫర్డు క్రిప్సు గారు చెప్పినట్లు ఇంగ్లాండు అందు కెంతమాత్రం అంగీకరించదనెను. కాంగ్రెసు నాయకులు సంయుక్త రాజ్యాలకు చిక్కులు తెచ్చిపెట్టుట తమ ఉద్దేశంకాదని ఎంత చెపుతున్నా, కాంగ్రెసు తీర్మానం మన శత్రువులకెంత ఆనందం కలిగించి సహాయంచేయునో వారికి బాగాతెలుసని ఆ పత్రిక వ్రాసెను. కాంగ్రెసు నాయకులకు యదార్థ రాజకీయాలు ఏమీ తెలియవని రుజువయినదని యార్కుషైరు పోస్టు వ్రాసెను.

లిబరలు పార్టీ పత్రికయగు మాంచెస్టరు గార్డియను సమదృష్టిగలపత్రికయని గాంధిగారే యిటీవల యోగ్యతా పత్రమిచ్చిరి. ఆ పత్రిక ఏమి రాసిందో చూడండి :—

"ఇండియాకు కొద్ది సంవత్సరాలలో ఎలాగూ రానున్న స్వాతంత్ర్యంకొరకు కాంగ్రెసు యిపుడు బహిరంగ తిరుగుబాటు చేస్తానని బెదిరిస్తున్నది."

స్టారు లిబరలు పార్టీవారి వేరొక పత్రిక యిట్లు వ్రాసెను :—

"మాట లెంతమార్చి చెప్పినా, సంయుక్తరాజ్యాలకు చిక్కులు కలిగించదలచుకోలేదని వేయిసార్లన్నా, గాంధిగారు తిరిగి తానుపవిత్రంగా తలంచు తిరుగుబాటుకే గడంగుచున్నారనుటకు సందేహంలేదు. ఈ సందర్భంలో వారు నిజం తెలుసుకోకపోవుట, దాని ఫలితమును గుర్తించక పోవుట భారత దేశ భావిస్థితి కెంతో అరిష్టము."

కాంగ్రెసు పార్టీని సర్వదా బలపరచు కార్మిక పత్రిక డెయిలీ హెరాల్డు విమర్శ అన్నింటికన్న ముఖ్యమయినది. అది యిట్లు వ్రాసెను :—

"భారతీయులకు మిత్రులమగు మేము, గాంధి నెహ్రూలతో కలసి పోరాడిన మేము, నాగరికత స్వేచ్ఛను రక్షించుటకు మాతో కలసి గాంధి నెహ్రూలు పోరాడెదరని ఆశించిన బ్రిటిషు కార్మిక పక్షమునకు చెందిన మేము—కాంగ్రెసు చర్యచూచి ఏమనుకోవాలి? మా భారతీయ మిత్రులకు యిట్లు చెప్పుటకు మాకు హక్కుగలదు : ఈ యుద్ధంపట్ల బ్రిటిషు కార్మికుల వైఖరి వారి రాజకీయ ప్రతినిధుల వైఖరి ఎట్లుండునో మీరు ఆలోచించుకోండి. వారికి కష్టాలుగలవు, వారునూ మీవలెనే సంకుచితదృష్టిని ప్రత్యేకసౌకర్యాలను విరోధించినవారే. నేడు జరుగుచున్న యుద్ధం అంతర్జాతీయ ప్రజాస్వ

దృష్టి కన్సర్వేటివు తత్వం నిర్మూలించుటకు జరుగుచున్న ఆఖరుయుద్ధమని వారు నమ్ముచున్నారు - హిట్లరు, టోజో, ముసోలీనీల రక్తపిపాసతో కూడిన కన్సర్వేటివు తత్వమునకును యితర ప్రపంచ ప్రజాస్వామికులకు జరుగుచున్న తుది పోరిదని బ్రిటిషు కార్మికులు నమ్ముచున్నారు. ఈ ముగ్గురి ఆశంతో పోల్చిచూచిన బ్రిటిషు కన్సర్వేటివు తత్వం చాల స్వల్పమయినది, త్వరలో మాయమగునది అట్టి నమ్మకంతోనే మేము మాదేశపు కన్సర్వేటివులతో చేరి, ప్రమాదము నెదుర్కొనుచున్నాము వారెంతైనా ప్రజాప్రతినిధి ప్రభుత్వవాదులే కదా ? మీరు వైదొలగియుంటారా ? మీ వైఖరి సమయమోచితమైనదనిగాని తత్కాలగుణ్యమయినదనిగాని మీరనగలరా ?"

**అమెరికా అభిప్రాయం.**

అమెరికా వార్తా పత్రికలు భారతీయుల స్వపరిపాలన వాంఛపట్ల సానుభూతి తెల్పుచు, కాంగ్రెసు నాయకుల నిరర్థక వైఖరికి విలపించుచున్నవి. కొన్ని పత్రికలు యిందువలన చీనా స్థితి యేమగునాయని భయము సూచించినవి. బాల్టిమోరుసను : బర్మాలో జాపాను సైన్యాలుండగా జర్మనులు ఆఫ్రికానుండి ఇండియాపైకి వచ్చుచుండగా, ఇండియాలో శాసనోల్లంఘనం యీ స్వాతంత్ర్య విరోధులగు నాజీలకు జపానువారికి ప్రోత్సాహం కలిగించకుండాయుండదనుచున్నది. బ్రిటిషువారితో తగవు మరచి ఇండియా రక్షణకై సంయుక్త రాజ్యాలకు తోడ్పడవలెనని ఫిలడిల్ఫియా ఇంక్వైరరు పత్రిక గాంధీని కోరుచున్నది. న్యూయార్కు టైమ్సు గాంధిగారు యీ తరంవారిలో మహా ఉన్నతమయిన ఆత్మగలవాడని చెప్పుచు యిట్లు వ్రాసెను !

"వారు బోధించిన ఆధ్యాత్మిక ధర్మసూత్రాలు మానవకోటి అనుసరించినచో యింక యుద్ధాలే యుండవు అయినను గాంధిగారిపుడు చెపతున్నది చేస్తున్నది సాగితే ఆతడిదివరకు బోధించిన ఆదర్శాలన్ని విఫలమయినట్లే."

న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూను అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పలుకుబడిగల ప్రతికూల పక్షం పత్రిక :—

"ఇండియాయొక్క శాంతిని గాంధి భంగంచేయ బెదిరిస్తున్నాడు. ఈ క్లిష్ట సమయమునందు ఇండియాలో అరాచకం తెచ్చిపెట్టు చర్యయెడల అమెరికాలో అక్ష రాజ్యాలమిత్రులు తప్ప యింకెవ్వరు హర్షింపరని భారతీయులకు స్పష్టంగా తెలియజేయాలి" అనెను

**అక్ష రాజ్యాలు.**

కాంగ్రెసు జూలై 14 వ తేదిన గావించిన తీర్మానం పట్ల అక్ష రాజ్యాల వైఖరి ఎట్లున్నదో తెలుసుకొనుట మంచిది. గత వారం యుద్ధ సంచికలో తెలిపిన అక్షరాజ్యాల రాజకీయాభిప్రాయ ధోరణి దృఢపడినది. యుద్ధంలో ప్రధానఘట్టమునందు మిత్రమండలి నిరోధశక్తిని సన్నగిల్ల జేయుటకు తోడ్పడునట్టి యీ కాంగ్రెసు తీర్మానానికి శత్రు రేడియోలన్నియు స్వాగతమిచ్చినవి.

సైగాను రేడియో హిందూస్తానీ భాషలో జూలై 14 వ తేదిన యిట్లు చెప్పింది.

"ఇట్టి ఘనకార్యములు బ్రిటిషువారి యుద్ధకృషికి ప్రతికూల ఫలితం చేకూరుస్తాయి

ఇండియా మహాప్రమాదమునకు గురియైయున్న యీ సమయమున భారతీయ పార్టీ నాయకులు దేశానికి అత్యవసరమగు రక్షణకార్యములకు ప్రతిబంధకము లేర్పరచుచున్నారని న్యూయార్కు పత్రిక వ్రాసెను అని రోము రేడియో జూలై 13 వ తేదిన తెలిపెను

జర్మను అజద్‌హింద్ రేడియో జూలై 17 వ తేదిన అరవంలో యిట్లు తెలిపెను —

కాంగ్రెసు యిపుడు ఆయుధ తిరుగుబాటు యేర్పాటు చెయాలి—అట్టి చర్య అక్షరాజ్యాల సానుభూతి సహాయములను సర్వదా పొందయగలదు అన్ని విధాల బ్రిటిషువారి యుద్ధ ప్రయత్నాలను నిరోధించండి.

మరునాడు యింకో అరవ ప్రసారంలో జర్మను రేడియో "అక్షరాజ్యాలు యీ ఉద్యమ వృద్ధిని కనిపెట్టుచుండును. తత్ఫలితమగు ప్రమాద పరిణామమునకు ఎవ్వరు ఆశ్చర్య పోనక్కర లేదు" అని హెచ్చరించెను.

జూలై 9 వ తేదీన జర్మను రేడియో హిందూస్తానీలో "అక్షరాజ్యాల బ్రహ్మాండమగు విజయాలు ఇండియా రాజకీయాభి వృద్ధిపై ప్రతిఫలించక మానవ" నెను. టోకియో రేడియో విశాఖపట్నం, కాకినాడలలో బాంబులు వేయుటను స్మరించుచు, అందువల్లనే ఇండియాలో రాజకీయ స్థితి మారిందనియు, తామింకను అట్టేకాలం వేచియుండలేమనియు బెదరించెను.

ఈ రీతిగ శత్రు రేడియోలన్నియు ఇండియాను బెదిరించి భయపెట్టి లాభంపొందుటకు జూచుచున్నవి. అక్షరాజ్యాలకు అమితమగు శక్తిగలదని చెప్పుచున్నవి, కాని అవకాశంవుంటే ఆ శక్తి నెట్లు ఉపయోగిస్తారో ఒక్క రోము రేడియో మాత్రం తెలిపెను. జూలై 15 వ తేదీన ఫ్రెంచి భాషలో యిట్లు రోమునుండి తెలుపబడెను. "సైనిక బలంలేని స్వాతంత్ర్యం విఫలం కాక మానదు." అనగా ఇంకోమాటలలో చెప్పితే, భారతీయుల స్వాతంత్ర్యానికి అక్షరాజ్యాల బలం అండగనుండుననియు, అక్షరాజ్యాలకే అధికారంకూడా యుండుననియు, తాము అంత

తీపి మాటలతో చెప్పుచున్న స్వాతంత్ర్యాన్ని అక్ష రాజ్యాలు ఎట్లు రక్షిస్తాయో జపాను తెలిపింది. జూలై 8 వ తేదీ జపాను రేడియోలో తూర్పు దీవులనుగూర్చి యిట్లు తెలుపబడెను :—

"జపాను సైనిక పరిపాలకులు యింకను దేశంలో మిగిలియున్న రాజకీయ పక్షములను రూపుమాపుటకు దారుణ కార్యాలు సైకొనుచున్నారు."

ఇండియా, చీనా.

నేటి ఇండియా పరిస్థితులను చీనాకు ప్రతికూలంగా అక్షరాజ్యాల ప్రచారకులు ఉపయోగించు కుంటున్నారు. ఇండియాలో స్వాతంత్రోద్యమము చుంగ్‌కింగునకు మిత్రమండలి సహాయమును తగ్గించునని జపాను భావిస్తున్నది. చంగ్‌కై షేకు సేనానిపై భారతీయులకు అనుమానం కలిగించుటకు అక్షరాజ్య ప్రచారం జరుగుచున్నది. భారతీయులు స్వాతంత్ర్య వాంఛను వదలుకోవాలని చంగ్‌కై షేకుగారు ప్రోత్సాహించినట్లు ఇటలీ రేడియో జూలై 16 వ తేదిన నిందారోపణచేసెను. కాని చీనా ప్రధాన సేనాని గత ఫిబ్రవరిలో ఇండియా వీడిపోతున్నపుడు తన బ్రిటిషు మిత్రులు "వీలయినంత త్వరలో భారతీయులకు నిజమగు రాజకీయాధికారం యిచ్చునని నమ్ముచున్నానని" చెప్పిన విషయం భారతీయులకు యింకా జ్ఞాపకంవుంది.

## భారతదేశంలో మందుగుండు ఉత్పత్తి.

క్రొత్త యంత్రం స్థాపింపబడుట నాల్గు ప్రాజక్టులు పూర్తియైనవి.

ఆల్కహోలు అసిటోను ప్లాంటు (యంత్రం యొక్క ముఖ్యభాగం) అనేకవేల మైళ్ల సముద్రాలు దాటి విమాన టార్పెడోలు జలాంతర్గాముల ప్రమాదం తప్పించుకొని, గమ్యస్థానం చేరుకొనెను. దానిని స్థాపించిన పిమ్మట ఇండియాలో మందుగుండు ఉత్పత్తి అత్యధికంగా అభివృద్ధి చెందును.

ఇటీవల కొద్ది వారాలలో మందుగుండు అభివృద్ధి ప్రాజక్టులు పూర్తిచేయబడినవి. ఒక మెటలు స్టీలు ఫ్యాక్టరీయందు క్రొత్త రీడు మిల్లు స్థాపించబడెను, ఒక ప్రేలుడు వస్తు ఫ్యాక్టరీలోను, కార్డైటు (తోటాల) ఫ్యాక్టరీలోను, మందుగుండు నింపు ఫ్యాక్టరీలోను ఆధునిక యంత్ర సామగ్రి అమర్చుట జరిగెను. వేరొక ఫ్యాక్టరీయందు షెల్లు తయారుచేయు యంత్రం అమర్చుట పూర్తియయినది.

ఈస్టరను గ్రూపు సంఘంవారు తలపెట్టిన వివిధ ప్రాజక్టులు కొనసాగుచున్నవి. టొలూను యంత్ర మొకటి అదనంగా రూ 14,00,000 ఖర్చుతో అమర్చుటకు అంగీకరించబడెను.

ఇండియాలో కాల్సియం కార్బైడు తయారు చేయుటగూర్చి ఆలోచనలు జరుగుచున్నాయి.

ఏప్రిలు మే మాసములందు వివిధ రకముల మందుగుండు ఆయుధ సామగ్రి అధికంగా తయారు చేయబడినవి. అందు 2 పౌండ్లునుండి 18 పౌండ్ల గుండ్లు, నేల ఫిరంగి గుండ్లు, చిన్న తుపాకి గుండ్లు, చేతి బాంబులు, తుపాకులు సున్నీలు గలవు. 178 టన్నుల మంచి ఉక్కు కూడ ఏప్రిలు మాసంలో తయారయింది.

ఇదివరకు విదేశాలనుండి వస్తున్న రసాయన పదార్థములు కొన్ని ఇండియాలోనే సృష్టించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అవి సాధారణ పరిశ్రమలకు, దేశరక్షణ పరిశ్రమలకుగూడ ఉపయోగింపబడగలవు.

మే మాసంలో కలప నిరిటి మే మాసంకన్న $2\frac{1}{2}$ రెట్లు అధికంగా సప్లయిచేయబడింది.

## మదరాసు సైన్యంలో జనహాని.

నెం. 99.

సైన్యంలో మదరాసువారికి యీ దిగువ జనహాని కలిగిందని తెలుపుటకు విచారమగుచున్నది :—

ఆఫీసరులు.

తప్పిపోయి, యుద్ధ ఖైదీలుగా నున్నారని భావింపబడినవారు.

| నెంబరు. | హెూదా. | పేరు. |
|---|---|---|
| ఐ.ఎం.ఎస్.— | | |
| ఎంజడ్/23503 | కెప్టను | ఎం. జగరాయను. |
| ,, 20867 | ,, | ఎం. వి. నాయర్. |
| ,, 20747 | ,, | పి. సి. శ్రీనివాసన్. |

ఆదివరకు తప్పిపోయి యిపుడు తిరిగి పనిలో చేరినవారు.

| | | |
|---|---|---|
| ఐ ఎం.ఎస్. | లెఫ్టనెంటు | కె ఎన్. పి. ఎస్. పిళ్లె. |

ఇతర తరగతులు, నాన్-కాంబటెంట్సు.

ఆదివరకు తప్పిపోయి, యిపుడు యుద్ధ ఖైదీలుగ నున్నట్లు రూఢియైనవారు.

మదరాసు సాపర్లు, మైనర్లు—

| | | | |
|---|---|---|---|
| 15203 | సేపరు | ... | చిన్న నాగప్పన్. |

చనిపోయినవారు.

ఇండియను సిగ్నల్ కోరు.

| | | | |
|---|---|---|---|
| 02650 | డబ్లు/సి. | ... | చిన్నసామి. |

# ద్వితీయరంగం - అద్వితీయరంగం.

రష్యాతో హిట్లరుయొక్క సేనలు తీవ్ర యుద్ధం చేస్తున్నవి. హిట్లరు తన అంచనా మదింపు లెక్కల ప్రకారము, తన మొట్టమొదటి ప్లాను ప్రకారం సుమారు ఒక సంవత్సరం క్రింద టనే రష్యాను జయించియుండవలసినది. 1941 వ సం॥ జూను మాసం చివరి వారంలో రష్యా మీదకు హిట్లరు తన దండయాత్రను మొట్టమొద టగా సాగించాడు. మూడు మాసాలలో లేదా నాలుగు మాసాలలో రష్యాను జయించగలననే అహంకారంతో యుద్ధంప్రారంభించాడు. అనగా, శీతకాలం వచ్చే సరికి రష్యాను జయించగలనని అంచనా వేసుకున్నాడు. కాని, రష్యాలో శీత కాలం ప్రవేశించేటప్పటికి హిట్లరు తన దండ యాత్రను పూర్తి చేయలేదు సరిగదా, మంచు గడ్డలతో ఆవరించబడిన ఆ రష్యను యుద్ధ క్షేత్రములలో నాజీ జర్మను సేనలు కాలు తీసి కాలు పెట్టలేకపోయినవి. ముందంజ వేయలేక స్తంభించిపోయినవి. ఆ శీతకాలమునకు రష్య ను సైనికులు చిరకాలమునుంచీ, అనేక తర ములనుంచీ అలవాటుపడినవారగుటచేత, మంచు లో స్తంభించిన జర్మను సేనలను సంహరించి, సమరం సాగించుచునే యుండిరి. మాస్కో నగర సమీపంవరకు వచ్చిన జర్మనులను స్మాలెంస్కు వరకు తరిమివేసారు. లెనిన్గ్రాడు వద్దకూడా జర్మను సేనలను చాలా మైళ్ల దూరం వెనుకకు తరిమివేసారు. హిట్లరు ఎంత వాయు వేగంగా, శరవేగంగా, విద్యుద్వేగంగా యుద్ధం చెయ్యవలెనన్ని సంకల్పించాడో అంతకు మరింత కాలహరణం జరిగింది.

హిట్లరు తన దండయాత్రలను అతివేగంగా ముగించవలెనని ఎందుకు కోరుచున్నాడు? అతి వేగంగా ముగించగలనని ఎందుకు తలంచు చున్నాడు? ఈ రెండు ప్రశ్నలకు జవాబు ఆలో చించి చెప్పగలిగితే, హిట్లరుయొక్క యుద్ధ సామర్థ్యం ఎటువంటిదో, హిట్లరును ఏవిధంగా గెల్చుటకు సులభసాధ్యమగునో బోధపడుతుంది. పూర్వకాలపు యుద్ధముకంటె, యీ కాలపు యుద్ధము వాయువేగంగా సాగుటకు కారణం, వాయువిమానాలు. అవిన్నీగాక, మెట్ట పటా లములుకూడా పూర్వకాలములోవలె గుర్రాలమీద పోవుటలేదు. మోటారులారీలమీద పోవుచున్నవి. ఫిరంగులను బిగించిన టాంకులు అనబడే ఫిరంగి మోటారులు యుద్ధరంగంలో ముందు చొచ్చు కొనిపోతూ, అగ్నివర్షం కురిపిస్తూ ఉంటాయి. వెనుకనుంచి మోటారు సైకిళ్లమీదను, మోటారు లారీలమీదను సేనలు అతివేగంగా వస్తు ఉంటాయి, కాల్బలంకూడా వెనుకనుంచి నడు స్తూ ఉంటుంది. టాంకులకంటె ముందుగా విమానాలు, గంటకు రెండువందల మైళ్ల వేగంతో పోయి బాంబులువేసి కోటలను సైనిక మకాములను భీభత్సం చేస్తూ ఉంటాయి. విమానాలు ఎదిరించుటకు వచ్చినట్లయితే, వాటిని ధ్వంసం చేస్తూ ఉంటాయి. ఈరీతిగా అతి వేగంగా విమానాలు ముమ్ముందుగా వెళ్లి రైలు మార్గమును, సైనిక మకాములను ధ్వంసం చేయుచున్న సమయంలోనే, ఫిరంగి మోటా ర్లు వెనుకనుంచి వేగంగా వస్తూవుంటాయి. ఒక్కొక్కప్పుడు విమానాలమీదనుంచి ఆకాశ గొడుగులతో జర్మనులు తమ సేనలను దింపుతూ ఉంటారు. ముందుగా జరిగేది విమాన యుద్ధం. అటుతర్వాత జరిగేది టాంకుల యుద్ధం. దాని వెనుకగా ముందుకు చొచ్చుకొనివచ్చేవి సైని కుల మోటారు సైకిళ్లు, మోటారు లారీలు. ఈవిధంగా అతివేగంగా నడిచేటటువంటి మోటా రు శకటముల మూలంగాను, అత్యంత వేగంగా నడిచేటటువంటి విమానాల మూలంగాను, యుద్ధ ము పూర్వకాలములోకంటె ఇప్పుడు అతివేగంగా నడిపించుటకు సాధ్యమగుచున్నది. జర్మనీ వాళ్లు విమానములను, టాంకులను విశేషంగా నిర్మించుకొని, యుద్ధానికి బాగా తయారైనారు. విమాన బలమున్నూ, టాంకుల బలమున్నూ తనకు ఎక్కువగా కలదనే అహంకారంతో, హిట్లరు చండవేగ పద్ధతిలోనే దండయాత్రలను సాగించగలనని సిద్ధాంతీకరించుకొన్నాడు.

కాని, దీర్ఘకాల యుద్ధం చేయుటకు తగిన సామర్థ్యం జర్మనీకి లేదు. దీర్ఘకాలం అనగా, కొన్ని సంవత్సరాలవరకూ యుద్ధం సాగించవలె నంటే, అధికసంఖ్యాకమైన సేన ఉండాలి. వర్తక వ్యాపారలన్నీ స్తంభించినటువంటి యుద్ధ కాలంలో, దేశంలో ఉన్న సరకులూ సామగ్రులూ

క్రమేణా తగ్గిపోతూ ఉంటాయి. సర్కారు ఖజానాలో ద్రవ్యం తరిగిపోతూ ఉంటుంది. జనసంఖ్య క్షీణించిపోతూ ఉంటుంది. కనుక, పెక్కు సంవత్సరాలు యుద్ధం చేయవలెనంటే, అంగబలం, అర్థబలం, ఆయుధ సామగ్రి బలం అతిసమృద్ధిగా అక్షయంగా ఉండాలి. జర్మనీ వంటి చిన్న దేశాన్ని ఆ విషయంలో పోల్చి చూస్తే, బ్రిటిష్ సామ్రాజ్యంముందర దోమవలె ఉంటుంది. అమెరికావంటి దేశంతో, అర్థ బలంలో ఎదిరించలేదు. రష్యావంటి బ్రహ్మాండ మైన రాజ్యంతో సరితూగలేదు. ఎంత సేన నైనను సమకూర్చగల శక్తి రష్యాకు పుష్క లంగా ఉంది. బ్రిటిష్‌వారికీ ఉంది. అమెరికా వారికీ ఉంది. ఈ మూడింటికీ గల అంగబలం లెక్కచూస్తే అందులో శతాంశంకూడా జర్మనీకి లేదు. అర్థబలంలో ఒక్క అమెరికాకుగానీ, బ్రిటనుకుగాని జర్మనీ జవాబు చెప్పలేదు. వర్తక వ్యాపారాలు ఈ యుద్ధ కాలంలో ఎంత స్తంభిం చినప్పటికీ, వస్తు సామగ్రులకు బ్రిటిష్‌వారి కెన్నడూ కొరతలేదు, కనుక, దీర్ఘకాల యుద్ధ మును ఎవరు సమర్థంగా చేయగలరనే పరీక్ష వస్తే, మిత్రరాజ్యాలవారే తప్పకుండా నిరాఘా టంగా చేయగలరు. అటువంటి దీర్ఘ సమరా నికి జర్మనీ నిలువలేదు. గత అయిరోపా సంగ్రామం కాలమందు, కెయిజరు చక్రవర్తి నాలుగేళ్లు యుద్ధంచేసి ఆఖరుకు ఫ్రాన్సులోనైనా ప్రవేశించలేకపోయినాడు. జర్మనీలో కరవు ఏర్పడింది. ప్రజలు తిరుగుబాటు చేసారు. దేశ మధ్యంలోను, యుద్ధరంగంలోనుకూడా జర్మ నులు మలమలమాడి, అంతకంటె ఎక్కువ కాలం యుద్ధం సాగించలేక, సాగిలబడి, సంధి చేసుకొన్నారు.

కాబట్టి జర్మనీని ఓడించవలెనంటే, హిట్లరు ప్రారంభించిన యుద్ధ యాత్రను దీర్ఘ వ్యాధిలోనికి దింపాలి. పురాణజ్వరం క్రిందకు మార్చాలి. "బుద్ధి తక్కువై యీ దిగ్విజయయాత్ర ప్రారం భించానురా భగవంతుడా!" అని చెంపలువేసు కొనేటట్లు చెయ్యాలి. రష్యాతో యుద్ధం ప్రారంభించిన నాడే, హిట్లరుకు యీ జంకు పుట్టింది. "నా జన్మలో నేను తలపెట్టిన బ్రహ్మాండమైన సంకల్పం ఇది" అని అన్నాడు. ఈవిధంగా హిట్లరు ఇంకా కొన్ని సంవత్సరాలు ఈ సంగ్రామ రంగములలోనుంచి బయటపడి గట్టెక్కకుండా, కాలయాపన అవుతూ ఉండవలె నని బ్రిటిష్‌వారు కోరుతున్నారు. ఈ కాల యాపన యుద్ధంవల్ల, యీలోపుగా జర్మనీయొక్క అంగబలం, ఆయుధబలం, అర్థబలం క్షీణిస్తూ ఉంటుంది. మిత్రరాజ్యాలయొక్క విమాన బలం, టాంకుల ఉత్పత్తి వృద్ధి అవుతూ వుం టుంది. పైకి స్థూలంగా పరిశీలించే వాళ్లకు మాత్రం జర్మనీ పొందుచున్న విజయపరంపర లవల్ల అంతకంతకు హిట్లరు బలిసి విర్రవీగు చున్నట్లుగానే కన్పిస్తుంది. కాని, ఆవిధంగా శరీరం విర్రవీగినట్లుగా ఉండుటవల్ల ఆ లావు, ఆ పెంపు బలమని భ్రమించకూడదు. పైకి విర్రవీగి లావైనప్పుడే, శరీరంలో ధాతుపుష్టి తగ్గి బొర్ర పెరిగి శరీరం గుల్లబారుచున్నదనిన్నీ, అది గుల్మవ్యాధి యనిన్నీ గ్రహించాలి. రాజ్యా లు జయించుటకొరకు జర్మనీకి జననాశనం చాలా అవుతూ ఉన్నది. అంతేకాకుండా, జయించిన రాజ్యాలను తనవశంలో ఉంచుకొనుటకోసం, తన సేనలను ఆ రాజ్యంలో విస్తరింపజేసి పంచి పెట్టవలసివస్తుంది. అందువల్ల అంతకంతకు జర్మనీకి అంగబలం పల్చబడిపోతూ ఉంటుంది. కనుక, కాలం గడచిన కొలదీ జర్మను బలం క్షీణచంద్రునివలె అవుతుంది. మిత్రరాజ్యాల బలం (అమెరికా బలం, బ్రిటిష్ బలం) శుక్లపక్ష చంద్రునివలె వృద్ధి అతువుంది.

రష్యావంటి బ్రహ్మాండమైన రాజ్యం ఇంతలో జయింపబడేది కాదు. రష్యాలో యుద్ధం మళ్లీ శీతకాలం వచ్చేవరకు సాగక తప్పదు. ఇప్పట్లో అది పూర్తి అయ్యేది కాదు. కనుక ఇంకొక్క మూడు నెలలు ఆగితే చాలునని బ్రిటిష్ మంత్రులు అంటున్నారు. అటు రష్యాలో హిట్లరు యుద్ధం చేస్తూచేస్తూ మంచమెక్కిన దీర్ఘ రోగివలె "ఇక మంచులో ముందుకు సాగమంచు" స్తంభి స్తాడు. ఆ సమయంలో ఇటు రెండవవైపున జర్మనీమీదకు బ్రిటిష్‌వారు దండయాత్ర సాగి స్తారు. అదే ద్వితీయరంగం సాగించుటకు దివ్యమైన సుముహూర్తం. ఈ ద్వితీయరంగం సాగించిన తర్వాత తిరిగి జర్మనీ తలయెత్తుకో లేదు. ఇంకో తృతీయరంగం అవసరంలేకుం డా, ఈ ద్వితీయరంగ యుద్ధమే అద్వితీయంగా, అఖండంగా సాగుతుంది. ఈ ద్వితీయరంగమే అద్వితీయరంగమై విజయరంగం కాగలదు.

# వార్తలు - విశేషాలు.

## సామ్రాజ్య దేశాలకు ఎగుమతి హెచ్చుట.

1940-41 వ సంవత్సరమునందు ఇండియా దిగుమతి ఎగుమతి వ్యాపారం బ్రిటిషు సామ్రాజ్య దేశాలతో ఎక్కువయినది బ్రిటిషు సామ్రాజ్యం మొత్తానికి ఎగుమతులు నూటికి 56 నుండి 61 వరకు పెరిగినవి; అందు ఇంగ్లాండు స్కాటులెండు, కనడాలకు తగ్గిపోయింది. సింహళం, బర్మా, ఆస్ట్రేలియాలకు ఎగుమతులు ఎక్కువయినందున మొత్తం ఎగుమతి ఎక్కువగుపడుచున్నది.

బ్రిటిషు సామ్రాజ్య దేశాలనుండి ఇండియాకు దిగుమతులు మొత్తం దిగుమతులలో నూటికి 56 చొప్పున యున్నవి. అంతకు ముందువత్సరం 56 చొప్పున యుండెను. ఇంగ్లాండు నుండి దిగుమతులు తగ్గినా యితర దేశాలనుండి హెచ్చినవి.

యంత్రాలు, లోహాలు, ఇనుము, ఉక్కు, రసాయనాలు, ప్రత్తి వస్త్రాలు, పనిముట్లు ఎక్కువగా దిగుమతి అయేవి. తేయాకు, జనుము, విత్తులు, చర్మాలు, ముడి ప్రత్తి, ముడి ఉన్ని, తెలకపిండి, ధాన్యాలు విశేషంగా విదేశాలకు ఎగుమతి అయినవి.

* * *

## పనివారి సహాయం.

ఈస్టు ఇండియా డిస్టిలరీసు అండు సుగరు ఫాక్టరీసు లిమిటెడు కంపెనీవారికిని అందు పనిచేయు కార్మిక సంఘం వారికిని చిరకాలంనుండి సంక్రాంతి పండుగ శెలవుల విషయమున తగవుండెను. కంపెనీవారు 5 రోజుల శెలవు అనవసరమనియు, పనివారు మామూలు శెలవు తగ్గించ రాదనియు వాదించుకొనుచుండిరి. కాని యిటీవల కార్మిక సంఘం వారు యుద్ధకృషికి తోడ్పడుటకై, యుద్ధం జరుగుచున్నంత కాలం సంక్రాంతి శెలవులు రెండు రోజులే యిస్తే చాలనిరి. మిగతా మూడు రోజులు యింకో సమయంలో నిచ్చుటకు కంపెనీ యజమానులు అంగీకరించిరి. ఈ కంపెనీవారి నెల్లికుప్పం ఫాక్టరీ పంటకాలాలలోనే పనిచేయునది గనుక యీ మార్పువలన పనికి భంగం కలుగకుండా యుండును. పైగా కార్మికులు అవసరమయితే సంక్రాంతి శెలవు రెండురోజులు కూడా పనిచేస్తామన్నారు. అట్లాగుండాలి యుద్ధకృషి యందు అభిమానం